# బలవంతబ్రాహ్మణార్ధ ప్రహసనము.



## రంగము 1.

[అప్పుడు దామోదరయ్య యను కరణము, అన్నంభొట్లను బ్రాహ్మణుడును ప్రవేశించుచున్నారు.]

అన్నం—(తనలో) అబ్బబ్బా! తల్లితద్దిన మెప్పుడో యెరుగని వాళ్ళతో వేగడము చాలకష్టము. వీడితల్లితద్దినం వీడికి జ్ఞాపకము లేదట. నేను చెప్పవలె నట! పురోహితుడను ముండాకొడుకును అవడం చేతను నాకర్మం కాలింది. ఇంతప్రొద్దెక్కి ఎందుకు వొచ్చావని వీడు మీద బడి కరుస్తాడేమో! వీ డమ్మకడుపు కాల. వీడు తగనిముండా కొడుకు. పెందలకడనే వత్తామంటె యీరోజునె కల్లుపాలెంలో యీ డిగవా డింట్లో తద్దినం వచ్చింది. వెళ్ళకపోతే నిక్షేపంవంటి రెండుపాత్ర్లగంగలో కలిసిపోతవి. ఆకక్కుర్తిచేత యింతపొద్దెక్కింది. ఈరహస్యము వీడితో చెప్పడానికి వల్లకాదు. అయినప్పటికి ఒకధైర్యమున్నది. వీడు పేరుకు బ్రాహ్మడేగాని కర్మిష్టి గాడు. వట్టిమాలముండాకొడుకు. అదిగో! బారెడుచుట్ట నోట్లో బెట్టుకొని కొరివిదయ్యంలాగ వీధిఅరుగుమీద గూర్చున్నాడు. ఏమైతే అయింది. వెళ్ళిచెప్తాను.

దామో—(చూచి) ఓహ్హోహో! అన్నంభొట్లుగారా! ఏమి యీలాగదయచేశారు? ఎదయినాశ్రాద్ధముందా ఏమిటి బాబు! అటువంటి వుంటేగాని యీశ్రాద్ధాలగద్దలు మావూరిమీద వాలవు.

అన్నం—మీరన్నమాట నిజమే. ఇప్పుడు మీశ్రాద్ధమే వొచ్చింది లెండి.

రామో—అదేమిటయ్యో! త్వరగా జెప్పు. కొంపతవ్వి మా యమ్మతద్దినంకాదుగదా యీవేళ? తిథేమిటి?

అన్నం—ఈవేళ మాఘ శు ౭ గాదయ్యా? మీ యమ్మగారి తిథి యీరోజునే కాదూ. ఆహాహా! ఎటువంటికొడుకులయ్యా! కన్నతల్లి ఆబ్దికమే జ్ఞాపకములేని మహా భావులు.

దామో—ఓరి! నీయమ్మకడుపు కాల! తద్దినమైతే నిన్న మొన్న చెప్పక యీవేళటయ్యా చెప్పడం! ఇప్పుడేలాగ? నాకు గోర్టుహీరింగులే జ్ఞాపక ముంటాయిగాని తద్దినాలు జ్ఞాపక ముండవు. ఆమాట తెలిసివుండి నీ వింతపొద్దెక్కి రావడం బాగున్నదా?

అన్నం—నేను పొరుగూరునుంచి రావలసినవాణ్ణి గనుక తీరుబడి లేకపోయింది. నా కాపరం చేపలపల్లె ఆయె. మీకాపరం చీపుళ్ళదిబ్బాయెను. ముందువత్తామంటు ముష్టియెత్తుకొనే ముండాకొడుకును తీరుబడి లేదాయెను. మీకు జ్ఞాపకములేదాయెను. ఇదంతా నా ప్రారబ్ధమండి. ఇప్పుడైతే యేమిమించిపోయింది. ఇప్పుడు జాముపొద్దుకన్న యెక్కువయెక్కలేదు. మూడుజాములలోపుగా తద్దినమవుతుంది. కానీ—

దామో—అసాధ్య మొచ్చిందే! దానికోసం తటపటాయిస్తున్నాను.

అన్నం—ఏమిటి ఆ అసాధ్యం. అసాధ్యాలన్ని నేను సాధ్యాలు చేస్తాను చెప్పండి.

దామో—సరే. విను. రాత్రి మా ఆవిడ వుల్లిపాయలపులుసు కాచింది. అదిఎంతో పాకానబడింది. పొద్దిటికూడా పులుసుమిగిత్తే అది పోసుకొని చద్దిఅన్నం తిన్నాను. అందుకని పెద్దసందేహంగా వుంది.

అన్నం—(తనలో) ఓరివీడితాడు తెగ! వీడు గొప్పఅసాధ్యం తెచ్చాడు. పోనీ యీరోజున శ్రాద్ధంమాని రేపు పెట్టుతామంటె రే

వు మావూళ్లో గమళ్ళగంగడి చిన్నదినం అక్కడికి పోక తీరదు. అం దుచేత ఏవో టప్పాలు గొట్టి యీరోజు నేకానిచ్చేస్తాను.

దామో—ఏమిటయ్యా! ఆలోచిస్తున్నావు ? ఏమీ పాలు పోలేదా ఏమిటి?

అన్నం—బాబూ! మీరు తెచ్చినపేచీ సామాన్యపుదా? ప చ్చినెలకాయ గొంతున బడ్డట్టుంది. ధర్మశాస్త్రం గట్టిగా ఆలోచి స్తున్నాను. అయితే మీరు మొగం కడుక్కున్నారా ?

దామో—ఏమి ఆలా గడుగుతున్నారు?

అన్న—మీ మొగంమీద బొట్టు చెరిపోలేదు. అందుచేత క డుక్కోలేదనుకున్నాను.

దామో—నిజమేనయ్యా ! మఱచిపోయినాను. పొరబాటే జరిగింది. తెల్లవారుజామున నేరైతువాడు వచ్చాడు. వాడేదో పేచీవ్య వహారము మాట్లాడుతూకూచున్నాడు. ఆమాటలసందడిని మొగం కడుక్కోడం మఱచిపోయి, కడుక్కున్నాననుకొని శీతగ్రాసం జేసేశా ను. ఇందు కేమైనాదారుందా? పోనీ రేపు పెట్టగూడదు.

అన్నం—అమ్మయ్యమ్మా! ఎంతమాట. యీ వేళే పెట్టితీరవలెను. శాస్త్రాలొప్పవు దీనికి నేను పరిహారం చేస్తాను వినండి. పలుగఱ్ఱ వే యకమునుపు చేసినభోజనం నిన్నటి భోజనముతో సమానము. ఇప్పు డులేచి చప్పుచప్పున మొగం గడుక్కో. దంతధావనం అయింతర్వా త భోజనం చెయ్యకపోతే యీరోజున నీవు బోజనంచెయ్యనట్టే.

దామో—వహోవ్వా! మహాబాగున్నదయ్యా ధర్మశాస్త్రం. అయితే మావూళ్లో రెండవబ్రాహ్మణంకొంప లేదని నీకు తెలుసునుగ దా. ఇప్పుడు భోక్తలెవరు దొరుకుతారు?

అన్నం—నే నొక భోక్తను గదా! మంత్రంకూడా నేనే చెప్తా ను. రెండవ భోక్తను చూడాలి. అదేకష్టము. ఒకపని చెయ్యండి. మీ

వూరి పుంతలో యిలా వెట్టివుంకన్ని వుండమనండి. ఆదారిని యెవరైనా బ్రాహ్మడు వెళ్ళుతూవుంటే దారి కడ్డంగొట్టి మనయింటివైపు లాక్కు-రమ్మనండి. ఎవడో ఒకడు దారిని వెళ్ళకపోడు.

దామో—వహవ్వా వహవ్వా! మీబుద్ధి పాదరసంవంటిద య్యా. నీపొట్ట వుపాయాలపుట్ట. నాకు రాజ్యము లేదుగాని వున్నట్లు యితే నీ కొకఅగ్రహారం పారవేస్తును.

అన్నం—రాజ్యముంటె యిలాటిమాట అనకపోదురు. లేదుగనుక శుష్కప్రియాలు చెప్పడంలో భారీ ఎక్కువ. ఈమాట కేమిగాని ముందు వెట్టివాణ్ణి పంపించండి.

దామో—ఒరే వెంక!

(అప్పుడు వెట్టివెంకడు ప్రవేశించుచున్నాడు.)

దామో—ఒరే వెంకా! నీవిప్పుడువెళ్లి మన వూరిపొలిమేర లో నిలుచుండి బ్రాహ్మడెవడైనా ఆదారిని వెళ్లుతుంటే వెళ్ళనియ్యకుండా మనింటికి దీసికొనిరా. ఎన్నిబతిమాలిన దాటిపోనియ్యవద్దు.

వెంక—చిత్తం బాబయ్యా! కామందులోరి శెలవైనాక బాపనోణ్ణె దాటిపోనిత్తానా? అట్టె తెగనీలిగాడంటే బాపనోడుమీాదమడి సంక లిరగమొదుత్తాను. అంతే!

దామో—ఒరే! కొట్టడంమాత్రం కొట్టవద్దు. నయంచేతనో భయంచేతనో ఏలాగో ఒకలాగు నాదగ్గిరకు తీసుకొనిరా.

వెంక—మాటన్నాగాని గొడ్తానంటండి.

(అందరు నిష్క్రమించుచున్నారు.)

రంగము 2.

[వెంకడు పొలిమేరలో ప్రవేశించుచున్నాడు.]

వెంక—(తనలో) అబ్బబ్బా పొద్దు నెత్తిమీాది కొచ్చింది. బుర్ర మాడతావుంది సద్దిగెంజి తాగి రాలేదు. కడుపులో మాడ్తావుంది

ఈడబ్బడిసిగ్గొయ్య ఒక్క బాపనోడు రాలేదు. యెంచేపు గూకోను కాపులు మొగాలు కమ్మోరిమొగాలు గాపస్తున్నాయిగాని బాపనోడి మొకం కాపణ్ణేదు. ఇంటి కెల్లి సూంతగంజి తాగొద్దునా? ఎత్తె కర్నం గోరేమంటారో! బొమ్మడు దాటిపోయెనా కర్నపోడు నామీద మండి యేడుత్తాడు. ఈడమ్మచద్దెన్నంగాదుగాని నాకునకసా వొచ్చింది.

[అప్పుడు పురుషోత్తమావధానులవారు ప్రవేశించుచున్నారు.]

పురు — నమో, నమో, భవతి, భవతి, జాయమానోహ్నం(అను పనస చదువుకొనుచు నడుచుచున్నాడు.)

వెంక — ఓబాపనయ్యోయి! అక్కడుండు! అక్కడుండు!

పురు — ఎవరు వారు?

వెంక — ఈవూరె రెట్టోణ్ణండి.

పురు — వెధవముండాకొడక! నాతోనీ కేంపనుంది? అంతదగ్గిరగా నిలుచుంటావేం? పో! దూరంగబో. నన్నుండమంటావెందుకు? వెధవా, దారిలో కొరివిదయ్యంలాగ నిలుచుని అందరికి అడ్డమొస్తావేమిటి.

వెంక — ఉండుండు మంలె పిచ్చికుక్కలాగ ఒకటే వరసని మొరుగుతావేంటి? నామాటంతా యినండి. యిన్నాక తిట్టొచ్చును.

పురు — నీమా టేమిటి? వెధవమాట. పొద్దెక్కుతూంది నేను తొందరగా పోవాలి. సదస్యంగుడ్డబోతుంది ముందూళ్ళో. నేను దోవనేనడుస్తుంటాను. వెనకాలేవొచ్చిచెప్పుతుండు. ఆమా టేమిటో

వెంక — నే నడ్డం లెగిత్తే యీటకుక్కలాగ అదేపరుగు నీవు; నాకు దొరుకుతావా బాపనయ్యా! నామా టినుం. మావూరి కర్నపాయనింట్లో చద్దెన్నమంట. అదేదో నీకు మెడతారంటరా! నిన్నుతీసుకొనిరమ్మన్నారు రాండి యెల్దాం.

పురు—మీవూరి కరణ మేమిటి? చద్దెన్న మేమిటి? నాకు బె ట్టడమేమిటిరా? ఆమాట సరిగా దెలియలేదు. మీకర్ణంగారింట్లో తద్దినమూ యేమిటి!

వెంక—అడుగదేగామును! మీబోటి బాపనోళ్ళ గొడవలు వోరికి దెలుస్తాయి. ఆ అన్నంబుట్టబామ్మడూను మాకర్నంగోరు సెప్పుకున్నారు. ఆగొడవలు నాకెందుకు గాని రాండి! యెల్దారి.

పురు—మంత్రం జెప్పడానికా యేమిట్రా నేను! నాకు తద్దినం మంత్రం రాదు.

వెంక—మంత్రిమో తంత్రిమో ఆవూసు నాకు తెల్దు; కూడా రాండి.

పురు—నేను రాను. అవతల వూళ్ళో సదస్యపువేళ మించిపోతుంది. దొరికే జామారుగుడ్డ కాస్తా పోతుంది.

వెంక—రాకపోతే నేను వొదిలిపెట్టేవోణ్ణి గాను.

పురు—(కోపముతో) ఒదిలిపెట్ట కేంజేస్తావురా దొంగముండాకొడకా! చెప్పతీసు కొట్టిస్తాను. బొండవేయిస్తాను. తవ్విపాతేయిస్తాను. వెధవా! దారెం బడి వెళ్ళనియ్యకుండా అడ్డపెడ్తావా? ఎంతపొగరెక్కావు. గొడ్డుమాంసం దిని కొవ్వెక్కావు. కొవ్వుతీయిస్తా జాగ్రత్త!

వెంక—అబ్బోసి నాయనా! బండనేయింతావా? కొవ్వుదీయింతావా? బయమేస్తావుంది. ఎలకబొక్కలో దాక్కోవాలి ఏయించావుచాల్లేరా! రా యీపాటికి. మీలాంటి బూడిదబూసుకున్న బామ్మడికే జడుత్తా ననుకొన్నావా యేంటి? నువ్వేం తాలూకచ్చేరి బంటోతువా? పోలీసుజవానువా? ముంచీబువా? కరణానివా నీకు జడ్సేటందుకు? రుద్దరాసిగయ్యలు మెల్లో యేసుకొని ఒంటినిండా ఎలిమిడి బాముకోంగానే బయ మనుకున్నావా యేమిటి? కర్నాలయింటి కొత్తే సెడిపో

తావా యేంటి నువ్వు? పప్పుకూడు పప్పులు కాయగూరలు దప్పళా లు దొబ్బితింటావు. నెయ్యన్నం తింటానికి కట్టపడతావు గామోసు? రా రా! యీపాటికి.

పురు—వెధవకొడకా! నే రాను. ఏంజేస్తావో చేయి.

వెంక—ఏంజేత్తానా! నీలిగావంటే ఆకాంతపని చేత్తాను.

పురు—దిక్కుమాలినముండాకొడకా! యేంపని జేస్తావురా?

వెంక—ఏంపని జేస్తానా! మీాద మడీ ముట్టుకుని జెబ్బలు రెండు మట్టుకొని చచ్చినగేద్దూడను లాక్కెల్లినట్టు లాక్కెల్లి మాకర్నంగోరి యీవరుగుమీాదమూరేత్తాను. అప్పుడు నీతెగు లొదుల్తది పెద్దనుడిసి తరాగా రావయ్యా బేమ్మడాని మెల్లిగా బతిమాలుకొని బతిమాలుకొని అడుగుతావుంటే తాడిసెట్టెక్కి మొగుల్లో గూకుంటావు.ఇవతల మాలోడేగాని అంత శాతగానోడుగాడు. మల్లానూసొ్క! మరి నాతమూాసా ఏంజేత్తానో. గింజుకున్నానంటే దిమ్మ తిరగేత్తాను ఎట్టెంకడంటే ఓడనుకున్నావేమిటి? సచ్చెదవ గాడు. పట్టుకుంటె ఒదల్డు. పిశాసం. కతుపునింపాకూడెట్టాడు రమ్మంటే తడిసినసులకమంచంకుక్కలాగ బిఱ్ఱబిగుత్తా వేంటి? మీాబాపనోల్లు నన్ను పిలుగ్రి గాని పిలిత్తేనా కమ్మగా గూకొని పప్పు ల్తిందును.

పురు—(తనలో) ఈదుర్మార్గుడి వైఖరి నుతిమించి రాగానపడింది. తాగివచ్చినట్టున్నాడు. నేను మోటతనంజేసి రానంటే నామర్యాద నిలిచేటట్టు కనపళ్ళేదు. మాలముండాకొడుకుకు భయమూ భక్తా? మీాద పడి ముట్టుకొని వాడన్నంతపని జేస్తాడు. అంచేత నేనే మాట దక్కించుకొని వీణ్ణి బతిమాలడంకంటె ఎంత మోటముండాకొడు కయినా బ్రాహ్మణుడు గనుక కరణాన్నే అడిగి తప్పించుకు వెళ్ళడం మంచిది. మోటసరసం చెయ్యగూడదు. (ప్రకాశముగా) పదతా! ఒస్తున్నాను మీాకరణంగారిదగ్గిరికి. ముందునడు. దారిచూపించు.

వెంక—చిత్తం బాపనయ్యాగోరు! ఇది బుద్ధికల మాట. రండి! నాయెనకాల రండి! ఒచ్చినట్టే వచ్చి పారిపోయేవు సుమా బాపడా! పందినిగొట్టినట్టు గొట్టేత్తాను. నానంగ తెరగవు.

పురు—అట్టేపేలకు. నడు పెధవా. ఒస్తున్నాను.

(అని యిద్దరు నడుచుచున్నారు.)

వెంక—(కొంతదూరము నడచి) అల్లదుగో! కర్నంగారిల్లు లోని కెల్లండి. ఆయనే యిలాగొస్తావున్నారు. బాబయ్యాగోరు! ఇదుగో నండి బామ్మణ్ణి దీసుకోనొచ్చాను.

దామో—తీసుకొని వచ్చావా? ఏరీ? ఈయనేనాఏమిటి? మీ దేవూరండి?

పురు—మాది వేదపల్లి. తమరేనా యీవూరి కరణంగారు?

దామో—నేనేనండి. మీ రేవూరు వెళ్ళుతున్నారు?

పురు—కొక్కిరాయిపల్లిలో కోమట్ల యింట్లో వివాహమున్నది. సదస్యానికి వెళ్ళుచున్నాను. మీ రెందుకో రమ్మన్నారట.

దామో—ఈరోజున మాతల్లిగారి తద్దినం మాకు భోక్తలు దొరకలేదు. మాపురోహితు డొక డున్నాడు. రెండవ బ్రాహ్మడు లేక దారివెంట ఎవరు వెళ్ళుతూంటే వారిని పిలుచుక రమ్మని వెట్టివాణ్ణి పంపించాను. వాడు మిమ్ముల్ని తీసుకొని వచ్చాడు. మీరు రెండవ భోక్తగా ఉండవలె.

పురు—నారాయణ నారాయణ! ఎంతమాట! నేనుతద్దినబ్రాహ్మణార్థాలు మానేసి యిరవై ఏండ్లయింది. జీవపితృకుణ్ణైనంతకాలం చేశాను. మాతండ్రిగారుపోయినతర్వాత మానివేశాను. పైగానేను అవధానంచేశాను. కొద్దో గొప్పో కర్మిష్టిని. అటువంటివాణ్ని నేనాతద్దిన బ్రాహ్మణార్థం చేయడం? పైగా కొక్కిరాయిపిల్లి సదస్యంలో మాకు వరహా కిమ్మత్తుగల జామారు వస్తుంది. అది చెడగొట్టకండి.

అవన్ని అటుంచండి. తద్దినం రేపో యెల్లుండో అనగా బ్రాహ్మణులను పిలుచుకోవాలి గాని రెండుజాములయిన తరువాత తద్దినం రోజున దారిని పోయేబ్రాహ్మణ్ని కొట్టుకొనిరమ్మని వెట్టివాణ్ని పంపుతారా? మీరెంతనియోగ్య ప్రభువులైనా వెట్టివాడి చేతనా తల్లితద్దినానికి బ్రాహ్మణ్ని పిలిపించుకోవడం. చాలుచాల్లేవయ్యా! అన్ని అవకతొవకలేనా? ఎవరయ్యా మీపురోహితుడు? శిష్యుణ్ణి యీలాగు తయారు చేసినాడు?

దామో—మాపురోహితుడు మాకు తగ్గవాడే లేండి. వెట్టివాడు పిలిచాడని అభిమానంగావుందా? ఎవరు పిలిస్తేమి. బ్రాహ్మడు పిలిస్తే నీకు వరహాలు ఒలికాయా? వెట్టివాడుపిలిస్తే అవి లేక పోయినాయా? గొప్ప కర్మిష్టి నని చెప్పుకుంటున్నారు మీరు. యెక్కడ బ్రాహ్మడు దొరక్కపోతే కర్మ చెడిపోదా యీవేళ నాలుగురూపాయల జామారు కోసగం చూచుకుంటున్నారు గాని మీరు బ్రాహ్మణ కర్మకొరకు చూచుకోడంలేదు. అభావ మొచ్చినప్పుడు అవధానం చేసినవారైనా సరే దేవతార్చనపరులైనా సరే సోమయాజులుగారైనా సరే, బ్రాహ్మణార్థంచేసి బ్రాహ్మణీకం నిలపెట్టవలె. కర్మలు చేసేవారు మీరే యీలాగంటె మావంటివాళ్ళకు పారాగతమున్నదా

పురు—కర్మలు చెడిపోగూడదు. గాని బ్రాహ్మణార్థముచేసేవాడు చేయనివాడు అంటూలేదా? నామనవి విని నన్ను వదలి వెయ్యండి.

దామో—నిన్ను నేను వొదలను ఇక్కడనుంచి అడుగు కదిలినావంటే వెట్టి వెంకడిచాత నిన్ను కూర్చుండ బెట్టిస్తాను.

పురు—వీథిలోకి వెళ్లితే వెట్టివాడు పట్టుకుంటాడుగాని లోపలరాడు. నేను యింట్లోనే యుండి బ్రాహ్మణార్థానికి కూర్చోను.

దామో—మావంటశాల్లో గుంజకు నిన్ను విరిచి కట్టేసి నేను తద్దినం పెడ్తా.

పురు—నేను నాలుక పెరుక్కొని చస్తాను.

దామో—చస్తే శవానికైనా అర్చిస్తాను కాని నిన్ను వొదిలి పెట్టను.

పురు—నాయనా! యివిచేతులుగావు కాళ్ళు నన్నురక్షించండి (అని చేతులుపట్టుకొనుచున్నాడు)

దామో—ఇవి కాళ్ళుగావు చేతులు; కర్మనిలవండి. (అని కాళ్ళు పట్టుకొనుచున్నాడు.)

పురు—(తనలో) ఈముండాకొడుకు శతబంఢ: సహస్రబండ. కరణం తలుచుకుంటె మరణం తప్ప దన్నాడు. ఈవేళ యిక్కడ బలవంత బ్రాహ్మణార్థంతప్పదు. దేవుడా అనియేడుస్తూ నానిష్టంతా చెరుకొని బ్రాహ్మణార్థంచేసి తీరవలసిందే ప్రొద్దెన్నే లేవగానే పుట్టుకుంకముండ ఆమంగమ్మకుండ పేడముద్ద చేతిలో బెట్టుకొని ఎదురుగా వచ్చింది. అందుచేత నాకీయోగంపట్టింది (అని ప్రకాశముగా) ఊ సరే: బ్రాహ్మణార్థం చేస్తే రెండవ బ్రాహ్మడేడీ మఱి!

దామో—అదుగో మాపురోహితుడు అన్నంభొట్లు స్నానం చేసి యిపుడే వస్తున్నాడు.

పురు—(చూచి) అన్నంభొట్టుంగారూ! ఏవూ రండి మీది

అన్నం—మాదిచేపలపల్లె. మీది వేదపల్లి. మీరు నన్నెరుగరుగాని మిమ్మల్ని నే నెఱుగుదును.

దామో—అయ్యా మీరుగూడ స్నానం చెయ్యండి అప్పుడే మూడుజాములు గావొచ్చింది.

పురు—ఒక్కసారి స్నానంజేశాను. మీనూతిదగ్గరనే మళ్ళీ చేస్తాను. కాని అన్నంభొట్లుగారు! మీమెడలో జంఝుం లేదేమండి?

అన్నం—[తెల్లబోయి తనలో] ఎంత బ్రిమాదం జరిగింది. రాత్రి నల్లమందువాడికి డబ్బు లియ్యకుండా వస్తుంటే బోగంపాపి తల్లి

ముసలిముండ జంధ్యం పట్టుకు లాగి తెంపివేసింది. ఆమాట నేను మఱచే పోయినాను. ఉపాయంచేత దాటలేనా యేమిటి?

దామో.—జంధ్యం లేకుండా యల్లా బ్రాహ్మణార్థానికొచ్చావయ్యా.

అన్నం.—ఈ శ్రద్ధిన మెవరిది?

దామో.—మా అమ్మది.

అన్నం.—మీఅమ్మకు జంధ్య ముందా మఱి? మీనాయనకు జంధ్యంవుంది గనక ఆయన తద్దినానికి భోక్తకు జంధ్యముండవలెను అమ్మ తద్దినానికి జంధ్యమక్కరలేదు. ఇది ధర్మశాస్త్రసమ్మతమైన మాట. తెలిసివుండే చేశాను నేను. తెలియనివాళ్ళు మీరూరుకోండి. ఆయన మెడలోని జంధ్యంగూడ తీసివేయండి.

పురు.—మహారాజుల్లారా! నామెల్లో జంధ్యం తియ్యకండి. మీరు చెప్పినట్టు విని బ్రాహ్మణార్థం చేస్తాను. తర్వాత నాయేమ పేమొ నే నేడుస్తాను. పదండి స్నానం చేదాము. జన్మజన్మాంతర పాప ఫలం బయటపడి నాకీబ్రాహ్మణార్థం వచ్చింది.

(అందరు నిష్క్రమించుచున్నారు.

# అద్భుత శ్రాద్ధ ప్రహసనము.



{ అప్పుడు సదాశివుఁడు వినాయకశాస్త్రి, నరసింహాముసు పరిశీలించుచున్నారు. }

సదా.—పెద్దలు చెప్పగా వినుటయే గాని స్వయముగా నే నెన్నఁడు చూడలేదు. నేటికాలానికి నూతండ్రిగారు చనిపోవడం కాకు

లు ముట్టకొనకపోవడం సంభవించినది ఈవిచిత్ర మేమిటో నాకుఁ దెలియలేదు. చెట్లమీద కావలసి నన్ని కాకు లున్నవి. గోదావరి యొడ్డున క్రింద బోసినయన్నముఁ జూచి వెళ్ళిపోయినవి గాని ముట్టకో లేదు. దీనికిఁ గారణ మే మైయుండు నంటారు? మీరు చెప్పిన దంతా జరిగినమాట నిజము. నేను చాలకాలంనుంచి శ్రాద్ధకర్మ చేయిస్తు న్నా గాని యిటువంటిచిత్రముఁ జూడలేదు. పెద్దలు చెప్పేవారు.

నర — నే నీలాటివిచిత్రాలు రెండు మూడుచోట్ల జూచినాను. చచ్చిపోయిన వారికి మనస్సులో నే దైనఁ గోరిక లుంటే కాకులు ముట్టకో వని పెద్ద లంటారు. చచ్చిపోయినప్రేత మనకుఁ గనఁబడకుం డ దుడ్డుకఱ్ఱ చేతఁ బట్టుకొని అన్నముదగ్గిఱకి జేరకుండ కొట్టివేస్తుం దట. అందుచేతఁ గాకులు రా వట. ఆమాట నిజమేయ య్యుంటుంది. లేకపోతే నాలుగుమెతుకులు విడిచితే కావుకావు మని పదల కొద్ది కాకులు వచ్చి వాల్తాయి. ఆలాటిది తద్దినపుబియ్య పన్నము వేస్తే కా కులు రాకపోవడ మేమిటి? మిరపకాయలు జూచినా క్రింద వాలేకాకు లు అన్నముజూచివెనక్కు వెళ్ళిపోవడంగొప్పయాశ్చర్యంలోదికాదా నేను మీమేనమామను. మీ నాయనగారికి బావమరిదిని. కనుక నే నేదో హాస్యాని కంటున్నా నని నీ వనుకో వద్దు. మీనాయనగారికి యేవోకోరికలు కొన్ని వుండితీరుతవి. ఆకోరికలు నీవు కుమారుఁడ వై నందుకు తప్పక తీర్చి, తృప్తి పొందించవలెను. ఆలాగున చేస్తే బంధు వులు లోకులుకూడ మెచ్చుకుంటారు. "పుత్ర మంతే చ కర్మణి" అ న్నాఁడు శాస్త్రకారుఁడు. కాబట్టి నీవు తప్పకుండ కోరిక దీరుస్తా నని మొక్కుకో. ఇటువంటి సమయములో మనమనుసరించవలసిన శిష్టా చార మిదే.

సదా — మామయ్యా! నీవు వేళాకోళానికి చెప్పడం లేదు. ని జమే చెప్పుచున్నావు. అంతవఱకు నే నొప్పుకుంటాను. కాని యీవి

విషయములో నా కెంతమాత్రము నమ్మకము లేదు. కాకులు ముట్టుకోకపోవడానికి కారణాలనేక ముంటాయి. అన్నంచాలావేడిగ నుంటే ముట్టుకోక పోవచ్చును. దగ్గఱ మనుష్యులు నిలుచుంటే భయముచేత ముట్టుకోకపోవచ్చును. లేకపోతే అదివఱ కేదయినా తిని ఆకలి లేకపోతే ముట్టుకోక పోవచ్చును. అంతేగాని పితృదేవత లేమిటి దుడ్డుగఱ్ఱలు పుచ్చుకొని నిలుచుండుట యేమిటి! ఇ దంతా వట్టిపిచ్చిమాట. బ్రతి కుండగానే కోరికలు గాని చచ్చిపోతే కోరిక లేమిటి? అది నేను నమ్మను.

నర—నీ వంటే నవనాగరికుఁడవు గనుక నమ్మవు. నీతాతలంటివాళ్లు, నీముత్తాతలంటివాళ్లు నమ్మినారు. నీలె క్కేమిటి పత్రమేమిటి? మావూరిమునసబు రెండు లక్షలరూపాయల ఆసామి. అతఁడు చచ్చిపోయి నప్పుడు యీలాగే కాకులు ముట్టుకోలేదు. వా ళ్ళెన్నో దండాలు పెట్టుకున్నారు. ఎన్ని బెట్టుకున్నప్పటికి ఒక్క కాకై నా వాలలేదు. చిట్టచివరకు వాళ్ళప్రాణం విసికి అతఁడుంచుకున్న ముండకు నెలకు పదిరూపాయ లిస్తా మని దండాలు బెట్టుకుంటే కాకులు ముట్టుకున్నాయి. ఈలాటి విచిత్రా లెన్నో నేను భూమిమీఁద నెఱుఁగుదును. నిన్నగాక మొన్న బుట్టి కన్నులు దెరవని లొట్టకాయవు నీవు. నీనమ్మక మెంత జేసు నీ వెంత జేసు?

వినా—అయ్యా! సదాశివుఁడుగారు! మీరు మామాటలు కొట్టివేయఁగూడదు. నాకు పదిహేనోయేడొచ్చింది మొదలు యిప్పటివఱకు వందలకొలది శ్రాద్ధాలు చేయించాను. మావూళ్లో ఒకబ్రాహ్మడు యెనిమిదిలక్షలరూపాయల కధికారి. పరమలోభి. మిరపకాయ కాల్చుకొనేతిన్నాఁడు గాని అన్నము కడుపునిండా ఒకరోజుగూడ తిని యెఱుఁగడు. సైనుగుడ్డే కట్టుకున్నాఁడు కాని జరీపంచ యెన్నఁడు వేసికొనలేదు, ఆయన చచ్చిపోయినాఁడు. పోయినప్పుడు కొడుకు దేశ

ప్రఖ్యాతిగా దినవారాలు చేయఁదలఁచుకున్నాఁను. అది చచ్చిపోయిన [illegible] తేను. కొడుకు మొదటరోజునే పీనుగమీఁద ముప్పది రూపాయల పట్టుశాలువఁ గప్పినాఁడు. గోదానాలు చేసినాఁడు. దాని తో కోప మొచ్చింది. కాకులు ముట్టుకోవడం మానివేసాయి. డబ్బు ఖర్చుపెట్ట నని ప్రమాణముచేసి, దండము పెట్టుకున్నాఁడు. అప్పుడు వందలకొలది కాకలు వచ్చి ముట్టుకున్నాయి. ఈలాటి వింకా యె న్నో వున్నాయి. నమ్మనంటే యేలాగా? కాకులు ముట్టుకుంటే గాని గతులు లేవు. కుక్కలు మొదలైనవి ముట్టుకో గూడదు. అందుచేత మీమామయ్యగారు చెప్పినట్టు చేయండి.

సదా—మీరు నూఱు జెప్పండి. వేయి జెప్పండి. మీమాట లు నాకు నచ్చలేదు. అదిగాక మానాయనగారి కేమికోరిక లున్నవో నాకుఁ దెలియవు. ఆయన నాతో నేమి చెప్పి పోలేదు. మీతో నే మైదెన జెప్పి పోయినాఁ డేమో చెప్పండి. ఆలాగున తప్పకుండ చేస్తాను.

నర—మాతోను యేమి చెప్పిపోలేదు.

సదా—ఎవరితోను చెప్ప నప్పుడు యే మని మొక్కుకోను?

వినా—మీయిష్ట మేలాగో యాలాగు చేస్తానని మొక్కు కోవయ్యా.

సదా—సరే! వేరే మొక్కుకు నే దేమిటి? ఆయనయిష్ట మేలాగో యాలాగునే చేస్తాను. మీరిద్దఱు సాక్షులు.

నర—చేస్తావుగద! చేస్తావుగద! చేస్తావుగద!

సదా—ఏమి టన్నిమాట్లడుగు తున్నావు? నీ కేమైనచా ద స్తమా?

నర—(గుడ్లెఱ్ఱజేసి) చాద స్తమా! చాద స్తమా! (అని ముందు కువెనుకకునూగు చున్నాఁడు.)

వినా—ఇదేమి టయ్యో నరసింహంగారు! ముందుకు వెనుకకు నూగుచున్నారేమిటి? సదా తురకలు పుస్తకము జదివేటప్పు డాలాగే చదువుతారు.

నర—ఏమిటి? నా పేరు నరసింహమా? ఎవఁడు చెప్పినాఁడురా నీకు నాపేరు నరసింహమని. నీకు క్రిందు, మీఁదు బొత్తిగా తెలియడంలేదు. నీకు కండ్లు నెత్తిమీఁదికి వచ్చినాయి. జాగ్రత్త! నిన్న మాంతంగామింగేస్తా.

విలా—సదాశివుఁడుగారు! ఇ దేమి టీగోల? ఈయనకే మైన పూనిందా యేమిటి?

సదా—ధోరణి చూస్తే యాలాగే కనఁబడు తున్నది.

నర—ఏదోపూనిందా నాకు! ఏదోపూనిందా? (అని లేచుచున్నాఁడు)

సదా—పూనకపోతే పైత్యగించిం దేమో కూచో!

నర—నేను కూచోన్రోయి.

సదా—పోనీ! పండుకో.

నర—నేను పండుకోన్రోయి!

సదా—పోనీ! నిల్చో!

నర—నే న్నిల్చోన్రోయి.

సదా—పోనీ! యేం జేస్తావో చెయ్యి.

నర—ఏం జేస్తానా! కొంప పీకేస్తా! మిమ్ము లందర్ని పీక్కుతినేస్తా! గ్రుడ్లు పీకేస్తా. ప్రాణాలు తీసేస్తా నేలఁబట్టిరాచేస్తా!

వినా—సదాశివుఁడుగారు! మీకు మాట్లాడడం తెలియదు. మీరూరుకోండి!

సదా—నేనూరుకుంటాను. మీరే మాట్లాడండి.

వినా—నీవెవరో చెప్పవయ్యా.

నర—నే నెవరోయెరుఁగవటయ్యా? చిన్నప్పటినుంచి మాయింటిపౌరోహిత్యంచేస్తున్నావుగదా! యీమాత్రం తెలియదూ?

వినా—తెలికనే అడిగినాను. క్షమించి చెప్పవలె.

నర—నేనా నేను నరసింహముఁగాను. సదాశివుడి మేనమామను గాను.

వినా—అయితే ఎవరు మీరు?

నర—నేనా? నేను సదాశివుడి తండ్రిని. శ్రీనివాసరావును.

వినా—అయితె మీ రెందుకొచ్చారు?

నర—నోరెండిపోయింది నోరెండిపోయింది. అందుకొచ్చాను.

వినా—నోరెండి పోవడ మేమిటి? శిలోదక వాసోదకాలు తగలడంలేదూ?

నర—అబ్బబ్బా! ఆగుడ్డపిడుపునీళ్ళు ఎవరిక్కావాలె. అవి నాకక్కఱలేదు.

వినా—అందుకేనా కాకులు ముట్టుకోలేదు?

నర—అవును. నిస్సందేహముగా అందుకే.

వినా—అయితే. మీ కేంగావాలో చెప్పండి. మీకోరికతప్పి కారంనడుచుకోవడానికి మీఅబ్బాయిగారు సిద్ధంగా కూర్చున్నాఁడు. సదాశివుఁడుగారూ! మొక్కుకోవయ్యా; యిదే సమయము.

సదా.—ఇదివఱకే మొక్కుకున్నాను గదండీ. మళ్ళీ యిన్నిమాట్లెందుకు?

వినా—శ్రీనివాసరావుగారూ! మీఅబ్బాయిగారు మొక్కుకున్నారు. మీరు కావలసిం దేమో నిష్కల్మషంగా చెప్పండి.

నర—ఆలాగయితే చెప్పుతున్నా వినండి. నాకు నోరెండి పోతున్నది. వాసోదక మని పేరు పెట్టి గుడ్డపిడుపునీళ్ళు, శిలోదక మని పేరు బెట్టి తాయిగడిగిననీళ్లునాకుఁ బోసినమాత్రాన నాదాహం తీర

డం లేదు. మీరు వండివేసిన అన్నమువల్ల నా కాకలి తీరడంలేదు.

వినా—మరి మీ కేమి గావాలె?

నర—ఏమికావలెనా? చిన్నప్పటినుంచి యుదయమున నా కాఫీ అలవాటు. మధ్యాహ్నంపూట టీ అలవాటు. ఆరెండింటితో పాటు గోధుమరవ ఉప్మా అలవాటు. ఒక్కపూట కాఫీగాని టీ కాని లేకపోతేకాళ్ళుపీకేవి. తలప్పినొవచ్చేది.నడుమునిలబడేదికాదు. చేతులు వంకరలు పొయ్యేవి. నాలుక పిడచగట్టుకపోయేది. చెవులుదిబ్బళ్లువేసే వి. కండ్లు భైరవులు గమ్మేవి; నరాలు తోడి వేసేవి. ఆకాఫీచుక్కలు నోట్లోపడ్డట్టయితే వేసవికాలపుయెండలకు శోషిల్లిపోయిన మొక్కలకు వానకురిసినట్లుండేవి. అమృతంలాగుండే దంటె నమ్మండి. కాఫీ వుంటె నాకు పానక మక్కఱ లేదు మంచినీళ్లెప్పుడు త్రాగేవాణ్ణే కాను. గంగాభాండపుకొబ్బరికాయి యిస్తే గిరగిరత్రిప్పి అవతలపారేసేవాణ్ణి. కాఫీవుంటె నాకికయేమిఅక్కఱలేదు. ఉప్మ మ కాఫి యుంటే అన్నమైనా అక్కఱలేదు. అదే అన్నం. ఒక ప్పుడుకలాసాపుట్టిందంటే ఉప్మమాలో యింతకాఫీగాని టీగాని పోసుకొని మజ్జిగాన్నంవలె చారన్నంవలె త్రాగేవాణ్ణి మా తండ్రి చచ్చిపోయినప్పుడు ముందు కాఫీ నోట్లోపోసుకోందేగాని నిప్పు కుండ బట్టుకోలేదు. తండ్రితద్దినంరోజునగూడా ముందు కాఫీ త్రాగుతాను. తద్దినం రేపనగా ఆనాటిరాత్రియో తద్దినంనాటిరాత్రియో వేరే ఫలహార మక్కఱలేకుండా ఈరెంటితోనే కాలక్షేపం జేస్తాను. అటువంటి కాఫీ నా కిప్పుడు లేకపోవడంచేత యిప్పుడెంతో యిబ్బంది సంభవించింది. ఇటువంటికొడుకు నాకుండగా నేనింత బాధపడవలెనా? ఇప్పుడు నాముఖ్యమైనకోరిక యేమి టంటే కాఫీతో తర్పణంచేసి ఉప్మమాతో పిండంపెట్టవలెను. ఆలా చేస్తేకాని నాకు ముట్టదు.

వినా—సరే ఆలాగే చేస్తాము. కాని యిది శాస్త్ర మొప్పుతుందో లేదో. శాస్త్రములలో శిలోదకములు తలోదకములు వాసో

కదచెయులు ప్రబడియున్నవి. గాని కాఫీలు టీలు ఉప్పుమాలు చెప్పఁబడలేదు. శ్రాద్ధాలు ధర్మశాస్త్రప్రకారం చేయవలసినవి గాని మీయిష్టప్రకారం నాయిష్టప్రకారం చేయవలసినవిగావు. గారెలకు బదులుగా మసాలావడలు పెట్టమంటె శాస్త్రి లొప్పుతాయా?

నర—ఒప్పుతాయో లేకో నాకవసరంలేదు నాకు ముట్టడమే నాకుగావాలిగాని తక్కినవిషయం నాకక్కరలేదు. పూర్వకాలంలో మన్మథుఁడు సాంబమూర్తిగారి మూడవకంటిచిచ్చువల్ల కాలిపోయి, భస్మపటల మైనప్పు డతనిభార్య మైనరతీదేవి మన్మథునకు ప్రియమిత్రుఁ డైన వసంతునిఁ జూచి చచ్చిపోయిన తన మగనికి పువ్వుఁతేనెతో తర్పణమిచ్చి పుప్పొళ్ళతోఁ, బిండముఁ బెట్టవలసిన దనికొక్కిచెప్పెను. అక్కడధర్మశాస్త్ర మేమయినది. తిలతర్పణములు మానివేసిపువ్వుతేనెతో తర్పణములిస్తేను అన్నప్పిండములు మానివేసి పుప్పొళ్ళతోఁబిండము వేస్తేను మన్మథునకు ముట్టినప్పుడు కాఫీతో తర్పణమిచ్చి, ఉప్పుమాతో పిండం బెట్టి గారెముక్కలకు బదులు యిడ్డెనలు పెట్టితేను నాకు ముట్టకపోవునా? మీశాస్త్రములు తీసికెళ్ళి తుంగలో పూరదొక్కండి. బ్రాహ్మలకు పెట్టేటప్పుడుగూడ మాసికం రోజున తద్దినం రోజున క్షీరాన్నం కాచడం మానివేసి వేడివేడి కాఫీగాని వేడివేడి టీగాని దొన్నెల్లో పోసి విస్తరిచుట్లు పెట్టండి పిండివంటలు మానివేసి శాగా అల్లపుముక్కలుపోసి గోధుమరవతో నిమ్మపండ్లపులును పోసి తయారుచేసిన ఉప్పుమా విస్తళ్ళలో బెట్టండి. అప్పుడు నాయాత్మశాంతి పడుతుంది. అప్పుడు నాదాహము తీర్తుంది. అప్పుడు నాకడుపు నిండుతుంది.

సదా—ఏం బెట్టమంటేఅదేపెడ్త. నా కభ్యంతరములేదు.

వినా—నారాయణ! నారాయణ! ధర్మశాస్త్రాలు తగులడి పోతున్నాయి. ఇతరదేశస్థులను జూచి మనవాళ్లు యింట వంటలేని కాఫీ

లు, టీలు, ఉప్మాలు అలవాటు చేసుకోబట్టి చచ్చిపోయి పితృదేవత లయినతర్వాతగూడా ఆకాఫీనీళ్ళ మీఁద ఉప్మామీదగల వాంఛదీరకుండా యున్నది. ఇప్పుడు ధర్మశాస్త్రాలు మానివెయ్యాలి. "తిలోదక, వాసోదక, పిండప్రదానం కరిష్యే" అనుమాటలు తీసివేసి ఉప్మాపిండప్రదానం కరిష్యే కాఫీ తర్పణాం కరిష్యే అని మంత్రాలుమార్చి వెయ్యవలసి వచ్చింది. దీనమ్మకడుపుకాల కలిమాయలోకాన్ని యెంతవఱకు మ్రుంచేసింది. కూలిముండాకొడుకున్ను కర్మిష్టి అయిన బ్రాహ్మణముండాకొడుకుకూడా సోడాదాగి కాఫీదాగి యేడుస్తుంటె యిటువంటిరోగం పట్టకపోతుందా? గొడ్లు కుడితి త్రాగినట్లు కంచుచెంబుడు కాఫీదాగడమున్ను, కడుపులు చాకిబానల్లాగ పెంచుకొని రోగాల పాలవడమున్ను. ఈకాఫీలు కాఫీకొట్లు వచ్చినతర్వాతనే రోగాలు యెక్కువవుతూ యున్నవి. ఈకాఫీకొట్లు పోతేనేగాని మనంబాగుపడము. వేళలేదు, పాళలేదు, మడిలేదు, మైలలేదు, ఆకలి అయిందన్న మాటలేదు కాలేదన్నమాటలేదు గోనెబస్తాలోపోసినట్లు గాదారీపడవలో చక్క పూటుగా సరకు వేసినట్లు తిని దొర్లడమే మనవాళ్ళపని.

సర.—ఇదిగో! నేను వెళ్ళిపోతున్నాను. నే చెప్పినట్లుచేయండి. లేకపోతే పాడవుతావు.

వినా.—ఇది గొప్పచిక్కే వచ్చిందోయి.

సర.—చిక్కేలేదు, మాతండ్రిపేరుచెప్పి ఉప్మా, కాఫీ, టీలు పంచిపెడ్తాను. అదే శ్రాద్ధము!

# కైలాసదూతప్రహసనము.

---

## 1. రంగము.

[అప్పుడు వాసుదేవరావు ప్రవేశించు చున్నాడు.]

వాసు—(తనలో) తిట్టేనోరు తిరిగేకాలు ఊరుకోలేవని పె
ద్దలంటారు కాని పని చేసేచేతులు కూడా ఊరుకోలే వనుమాట
పై వాటితో కలపవలసినదే; ఏరోజు కారోజు హస్తలాఘవము చేసిమే
దోసంపాదిస్తేనే కాని నిత్యకృత్యం గడవను మూగానుశికి బువ్వ
గడుపవలె బట్ట గడుపవలె. పైగా నాజూదానకు నాతాగుడుకు నా
తిండికి నాబట్టకు కొంతమిగులవలె. దిక్కుమాలిన బ్రహ్మదేవుఁడు ఒ
క్కరూపాయలచెట్టు సృష్టించి నాకిచ్చినాడు కాఁడు అందుకే ఆః
ర్భాగ్యునకు లోకంలో పూజలేకపోయింది. వాఁడికేమిపోయేకా
మో కాని ఆబహ్మదేవుడు షోకుగా చేతికొద్దీ కర్చుచేసేవాఁడికి
బ్బియ్యాడు. ఒకరికి పెట్టక తాను తినక యెంగిలిచెయ్యి కాకికై న
ల్పనియ్యేబ్రాశివెధవలకు కావలసినంత డబ్బిస్తాడు. నామాట కూ
హరణముగా ఈరమాకాంతరా వున్నాఁడు. వీఁడితస్సాగొయ్యా!
డిదగ్గఱ లక్షరూపాయలున్నాయి. ప్రాణావసరము వచ్చి యెవఁడైనా
బదులునకు వస్తె నూటికి రెండురూపాయలువడ్డీ మీద అప్పిస్తాఁడు
వాయిదా దాటితే నూటికి నాలుగురూపాయలు పుచ్చుకుంటాడు.
ఇంట్లో రెండోవిస్తరి లేదు. తండ్రితద్దినమునాఁడైనా పైవాడిని పిలువఁ
డుఁ సొమ్ము పాపము పెరిగినట్లు పెరిగినది వీడిదగ్గఱ దానికి విడుదల
య్యేదారి లేదు. చూడవస్తే పిల్లలు లేరు. ఎవడినో పెంచుకుంటాడట
ఎందుకు వెధవపెంపు. పెంచుకుంటే నావంటివాఁడిని పెంచుకోరా
దూ. ఒకజోడుగుఱ్ఱాలబండి ఒకమోటారుబండిపెట్టి పెళ పెళ లాడు

చు ఎంతవేరు తెస్తాను వీఁడికి నేను. ఎవఁడో చస్తువేషవచు పెంచు కుంటాడు కాని నావంటివాఁడిని పెంచుకోనను. నేనెంతమందినో టోపీవేసి డబ్బు లాగినాను. కాని వీఁడివద్దఅ నాపాశిక పడినదికాదు. వీఁడికొంప లాగితేనే నాపత్రిజ్ఞ అని నాకుంది. బహులిమ్మన్నాను, పాశికపడలేదు. అర్ధరాత్రివేళ యుక్తడిదగలు ప్రయోనివెళ్ళి బంగారునగలని చెప్పి తాకట్టుమీఁద సొమ్మిత్యున్నాను. అప్పుడుకూడ నా ద్వాయము పాతిరదికాదు. దీనికేమిటుపాయము. వీఁడిపెళ్ళాము మాత్రము వెఱ్ఱిముండ. వీఁడు లేనప్పుడావిడవద్దఅ యేదైన పాచికవేస్తే నాద్వాయముపాఱుతుంది. ఇదిగో వీఁడు గుఱ్ఱమెక్కి యేవోవూరు వెళ్ళుచున్నాఁడు. బహుశః సాయంకాలమునకు రాఁడు. పాచిక ...డానికి కావలసినంతవ్యవధి యున్నది. పోలేరమ్మతల్లి ! యీవేళక ... నాద్వాయము పాఱితే నీజాతరలో రెండు మేకపోతుల నిస్తాను-న... దన్నమాట యేమిటి పాఱినకొద్దీ యున్నది.

(తెరలో)

... ఎక్కడికి వెళ్ళక జాగ్రత్తగా నుండు. తలుపు లన్నీ తాళాలు వేస్తావ్యా.

వాసు—(తనలో) అదిగో జాగ్రత్త అని చెప్పి వెళ్లిపోవుచున్నాఁడు. ఈవెఱ్ఱిముద్దరాలును టోపీపెట్టుటకు తగినవిధమొక్కటే యున్నది. దానికి తగినవేషము వేసికొంటాను. చిన్నప్పటినుంచీ పగటివేషాలలో దిరగబట్టి యేవేషానికి తగ్గదావేషానికున్నది. ఈవిడ శివభక్తురాలు. మత మంటే యీవిడకు చాలపిచ్చి యున్నది. నోములు వ్రతాలు అంటే చాలాయిష్టము. అయ్యావార్లు అమ్మవార్లు అంటేచాలాప్రేమ. అందుచేత యీవిడ నాటోపీలో పడకపోదు. ఇంటికివెళ్ళి వేషము వేసుకొని వస్తాను. (అని నిష్క్రమించును.)

2. రంగము.

(అప్పుడు వాసుదేవరావు ప్రవేశించు చున్నాఁడు.)

వాసు—(తనలో) ఇప్పుడు నేను సరిగా జంగము బసవయ్యలా గున్నాను; కనురెప్పలమీఁద చెవులమీఁద కూడా వీభూతిపూము కొన్నాను. అబ్బ వీటికడుపుకాలా; యీరుద్రాక్షతావళములమూలాన్ని మెడ లాగివేస్తూన్నది. ఏమైనాఒకగంటసేపు బాధ పడాలి. ఎవరండమ్మా లోపాల తలుపు తీయించండి.

(అప్పుడు మంగమ్మ వచ్చి తలుపు తీయును.)

మంగ—ఎవరు వారు. ఎవరికోసము వచ్చినారు.

వాసు—అమ్మా! రమాకాంతంగారియిల్లు యిదేనా?

మంగ—ఆ! యిదేనండి.

వాసు—అమ్మా! మీరేనా మంగమ్మగారు.

మంగ—చిత్తము నేనేనండి.

వాసు—నేనూ ఆలాగే యనుకున్నాను. వారు చెప్పినయీనవాళ్లన్నీ మీదగ్గఱ కనబడు చున్నాయి.

మంగ—ఎవరు చెప్పినయీనవాళ్ళండి యవి.

వాసు—ఎవరుచెపితేనేమి. తరుచాతతరువాతమీకేతెలుస్తుంది.

మంగ—తమ రెవరో నాకు తెలియదు. మామగవా రింట్లో లేరు. తమరు వచ్చినపని యేమిటో తెలియదు.

వాసు—అమ్మా! నే నెవరినో యెందుకు వచ్చానో సవిస్తరంగా చెపుతాను; నేను వచ్చినపని విని మీచిత్తమువచ్చినట్లు చేయండి. మాకాపురము కైలాసము. నేనునందికేశ్వరుఁడిని; నందికేశ్వరుఁడ నైతేసాధారణమనిషిలాగుననున్నావేమి అంటారేమో, నానిజరూపంచూపిస్తే జనులంతాజడునుకుంటారనిమామూలుమనిషిలాగచక్కావచ్చాను

మంగ—ఆహా! మహానుభావు లైననందీశ్వరులవారా? నను

స్కారము నమస్కారము. తప్పులు క్షమింపవలయును. తప్పులు క్షమింపవలయును. (అని చేతులు జోడించి కాళ్ళమీద పడును.)

వాసు—(తనలో) నేను విన్నది నిజమే. ఈవిడ యమాయకురాలే. అప్పుడే ధోరణి తెలుస్తూన్నది. (ప్రకాశముగా) —అమ్మా! తప్పులేమున్నవి క్షమించేటందుకు. నీభక్తికి చాలా సంతోషించినాము.

మంగ—దేవరవారు వచ్చుటవల్ల మాగృహపావన మైనది. తమ రెందుకు విజయము చేశారో చెప్పవలెను.

వాసు—అమ్మా! నేను నాస్వంతపనిమీద రాలేదు, పరోపకారముకోసము వచ్చాను. లేకపోతే నాకు కైలాసముకదిలి రావడానికి తీరుబడి యున్నదా! ఒక్కగడియ నే నక్కడ లేకపోతే జరుగదు. సాంబమూర్తిగారికి నేనే కుడిచెయ్యిని. నేనక్కడ లేకపోతే ఆయనకు తోచదు. ఆయనపనులన్నీ నేనే చేయాలి. ఆలోచనలన్నీ నేనే చెప్పాలి. పార్వతీదేవికి నేను పెదకొడుకునే. పార్వతీపరమేశ్వరులు అసమానం నన్నేపిలిచి నన్నే గౌరవిస్తారని ఆవిఘ్నేశ్వరుడికి ఆకుమారస్వామికి కడుపులో యెంతో అంతేగుబులు.

మంగ—దేవరవారియోగ్యత అటువంటిది కనుక ఆపార్వతీపరమేశ్వరులంత యాదరణ చేస్తున్నారు.

వాసు—అమ్మమ్మా! అలాగనవద్దు. అది నాయోగ్యతగాదు. ఇంతకు వారిదరికి నామీద అపరిమిత మైనదయ. వారి కంతదయ లేకపోతే నేనింతకాలము నిలవగలనా? వారిదయచేత నాకెంతగౌరవము జరుగుతూన్నదో చూడండి. సాంబమూర్తివారిదర్శనముచేయడం నిమిత్తం దేవేంద్రుడు, బృహస్పతి, బ్రహ్మదేవుడు, శ్రీమహావిష్ణువు మొదలైనదేవతలందఱు కైలాసమునకు వచ్చినప్పుడు దర్శనానికి తగినసమయ చెప్పవలసినదని నన్నాశ్రయించి నాయనుగ్రహము సంపాదించుకుంటారు. వచ్చేదేవతలు పోయేదేవతలు స్తోత్రము చేసే

దేవతలు వరము లడిగే దేవతలు కష్టసుఖములు చెప్పుకునే దేవతలు. అ ట్టువంటిచోటనుండి కదిలి రావడానికి నాకు తీరుబడే లేదు. అయితే ఆముసలాళ్ళకష్టం చూడలేక యిలావచ్చాను.

మంగ—ఏముసలాళ్ళు స్వామీ.

వాసు—ఎవరో నీలకంఠంగారు పార్వతమ్మగారు అని దంపతు లున్నారు.

మంగ—నీలకంఠంగారు మామామగారు. పార్వతమ్మగారుమా అత్తగారు.

వాసు—అవు నవు నమ్మా నే నెఱుఁగుదును. ఎఱిఁగుండబట్టే వారుపంపుతే యిక్కడికివచ్చాను నీవేనా అమ్మా, వారికోడలవు.

మంగ—చిత్తము. నేనేనండి.

వాసు—నీవిషయమై వారు చాలా చెప్పారు. ఈలోకములో వున్నంతకాలము వారి కిద్దఱికి నీవు చాలావుపచారము చేశావని నీవు భూదేవతవని మహాయిల్లాలు వని నీవుండబట్టి బూమిమీఁద వానలుకు రుస్తున్నా యని వారు చెప్పారు. అత్తమామల మెప్పు పొందుటచేత నీవు చాలాధన్యురాలవమ్మా!

మంగ—సరి సరి యెంతమాట అది నామంచితనముకాదండి. మాఅత్తమామలు పార్వతీపరమేశ్వరులవంటివారు. వారు మంచివా రగుటచేత నా కింత పేరుప్రతిష్టలు వచ్చాయి. నేను కాపరానికి వచ్చి నది మొదలుకొని వారు నన్ను బిడ్డలాగున జూచుకొనుచున్నారు.

వాసు—వారెంత మంచివారైనా నీమంచితనము లేనేకాని వారికా వుపచారము జరగదు.

మంగ—అయితే వారిద్దరు సౌఖ్యముగా వున్నారండి అక్కడ

వాసు—ఏమిసౌఖ్యమమ్మా. సౌఖ్యముంటే వారునన్నిక్కడి కెందుకు పంపుతారు.

మంగ—అయితే వారుమిమ్మిక్కడికి పంపింపించినారా యేమిటి.

వాసు—పంపకపోతే నాఅంతట నేను వచ్చానా మఱి

మంగ—స్వామి! నాకు తెలియలేదు. అయితే వా రెందుకు పంపించారు మిమ్మలిని.

వాసు—ఎందుకు పంపించారని మెల్లిగా అంటున్నావా? వా ళ్ళక్కడ పడేకష్టాలు చూచేటప్పటికి కళ్ళు చిల్లులు పడిపోయి నాఅంతట నేనే మీాదగ్గిఱకు రావా లనుకుంటూాంటే వారే పిలిచి నన్ను నీ దగ్గిఱకు వెళ్లమన్నారు. అందుకని నేను వెతుక్కుంటూ వచ్చాను.

మగం—అయ్యో! వారు కష్టాలు పడుతున్నారా అక్కడ.

వాసు—కష్టాలన్నా కష్టాలా! అమ్మా! కట్టుకుందుకుబట్టలులేవు వారికి. మీామామగారు గోచీపెట్టుకు తిరుగుచున్నారు మీాఅత్తగారు చిరుగులగుడ్డలు కట్టుకుని కాలక్షేపముచేస్తుంది. ఈదరిద్రముచేత వారు ప్రజలమొగము చూడలేక సిగ్గుపడి తిరుగుతూాన్నారు. చలిగాలికి బాధ పడలేక వారు చెట్టుతొఱ్ఱలో పండుకొనుచున్నారు. ఉందామంటే యిల్లులేదు. ఆచెట్టుక్రింద యీాచెట్టుక్రింద వారిపంచను వీరిపంచను తల దాచుకొనుచున్నారు. కర్చుచేసుకుందా. మంటే చేతిలో డబ్బు లేదు వారికి. వారుపడుచున్న కష్టా లిన్ని అన్ని కావు. రమాకాంతంపంతులుగారివంటికొడుకు మీావంటికోడలు నుండగా వారి కెన్నిపాట్లు వచ్చినవోచూడు ఆముసలవాళ్ళను చూస్తే నాకడుపు దరికోసుకొని పోవుచున్నది. నేనే కాదు అక్కడున్నవాళ్లంతా జాలిపడుతున్నారు. ఆపార్వతీ పరమేశ్వరులకు గూడా చాలా జాలి కలిగినది.

మంగ—(ఏడ్చును) అయ్యో! మామగారు! మీాకెంతకష్టము వచ్చినదండీ. అయ్యో! అత్తయ్యా! నేనుండగామీాకెన్ని కష్టాలు సంభవించాయండీ. మీారు దిక్కు మాలినపక్షులలా గైపోయారా. ఈలాటి పెంకుటిళ్ళు మీాకుండగా తలదాచు కొనుటకు కొంపే లేకపోవు

నా? కట్టుకొనుటకు గుడ్డలేదా! ఈలాగైపోతా రని యెప్పుడు అనుకో లే దత్తయ్యా. మీ రెంతోంత సుఖపడుతున్నా రనుకొన్నా నత్తయ్యా.

వాసు—అమ్మాయి! విచారిస్తే కార్య మే మున్నది. దానికితగినపని చేయాలి.

మంగ—ఏమిచేయాలో నాకు తెలియడము లేదండి.

వాసు—తెలియకపోతే అమ్మా నేను చెపుతాను వినండి.

మంగ—చెప్పండినాయనా. ఆదంపతు లిద్దరు సుఖపడేటట్టూ నలుగురిలో తలయెత్తుకొని తిరిగేటట్టూ యేమైనావుపాయం వుంటే చెప్పండి.

వాసు—చెప్పడాని కేముందమ్మా. మీ మామగారికి నాలుగు జరీపంచలు నాలుగు జరీకండువాలు మంచిబనారసు పట్టుపరచ కండువా వుండాలి. మీయత్తగారికి నాలుగుజరీచీరలూ రెండుపట్టు చీరలూ వుండాలి. ఏదోప్రదేశమాత్రంగా యిల్లుకట్టుకోడానికి నాలుగైదువందలరూపాయల్లుండాలి. నిత్యకర్చు వాడుకునేందు కింకొకవంద రూపాయలుండాలి. ఈమాత్రమైనావుంచునే కాని వాళ్ళ గౌరవముగా వుండేటందుకు వీలు లేదు.

మంగ—అయ్యోనాయనా ఆమాత్ర మివ్వడానికి మాకు శక్తి లేకపోలేదు. అయితే మావారింట్లో లేరు. ఆయనవచ్చినదాక మీరువున్నారంటే ఆయనతో చెప్పి యిప్పిస్తాను.

వాసు—చాలు చాలు. నేను స్టాపీనులన్నీ చెడగొట్టుకొని రావడమే కాకుండా యింకా మీవారొచ్చేందాకా వుండినా? నాకవతల పని లేదనుకొన్నావా? యిదేపని అనుకున్నావా? ఈపాటికప్పుడే సాంబమూర్తివారు బెంగపెట్టుకొని యెదురుచూస్తుంటారు. పార్వతీదేవి అన్నమే తినదు. నేనొక్క నిమిషమున్నా ఉండడానికి వీలు లేదు. ఇస్తే యి

# మహాపతివ్రతల కథలు.

గ్రంథకర్త:—మద్దూరి శ్రీరామమూర్తిగారు.

భారతరమణీమణులు బాగుపడవలెనన్న పూర్వకాలపు స్త్రీల చరిత్రముల ననుసరించి నడచుకొనుటయే యుత్తమమార్గము. అట్టివారి కుపయోగించుటకే యీపొత్తము వ్రాయబడినది. మరియు పరకాంతాసక్తులగు పురుషుల నామార్గమునుండి విముఖులజేయింపదగిన దీగ్రంథరాజమే. ఇందు సుకన్య, దమయంతి, సావిత్రి, చంద్రమతి, పద్మావతి, గాంధారి, కుంతి, సునీతి, రుక్మిణి, అరుంధతి, సరస, సంధ్యావళి, ద్రౌపది, శకుంతల, సీత, అనసూయ, సుమతి, నాలాయిని, ఊర్మిళ, లోపాముద్ర, జయప్రదాదేవుల చరిత్రములు విపులముగ వ్రాయబడినవి. వారు మానముసు కాపాడుకొన యత్నించిన ఘట్టములు చదువునపుడు శరీరము కంపింపకమానదు. వెల 0—12—0

# అరేబియన్ నైట్సుకథలు

గ్రంథకర్తలు:—కొచ్చెర్లకోట కామేశ్వరరావుగారు,

మద్దూరి శ్రీరామమూర్తిగార్లు.

ఈగ్రంథమును యవనయామినీ వినోదములంటారు. ఇందలి కథలత్యద్భుతకథావిధానములతో నెంతచదివినా చదవాలనే ఆసకల్పిస్తాయి. అన్నికథలను ఒక సంపుటముగానే ముద్రింపించినాము. ఇందు మహర్జాది కథనము, వణిజుడు-దయ్యములు, మొదటిబాటసారి, రెండవబాటసారి, మూడుపండ్లు, యువకుడు, అల్లావుద్దీన్, దూబాను, సిందుబాదర్తకుని యేడుయాత్రలను వివరించుకథలు, కీలుగుఱ్ఱము, భానోయను దేవకన్య, జాలరివాడు, వైద్యుడు, చిలుక, మరణశిక్షనందిన మంత్రి, నల్లదీవులరాజు, ముగ్గురుఫకీరులు, బొగ్దాదుస్త్రీలు మొదలగు 30 పెద్దకథలు కొన్ని యుపకథలతో కలిసియుండును. స్త్రీలకును పురుషులకును బాలబాలికలకును తీరుబడి వేళల నొకమిత్రునివలెనుండి కాలమును హాయిగాగడపజేయపమును. వెల రు 1—0—0

# స్త్రీల వ్రతకథలు

గ్రంథకర్త:—బాలాంత్రపు వెంకట్రావుగారు.

ఈ గ్రంథమింతవరకు మూడు భాగములుగ ప్రచురింప బడినది ఇందు మొదటిభాగమున మూగనోము, తద్దెకథ, ఉండ్రాళ్ళతద్దె అట్లతద్దె శ్రావణమంగళవారము, వరలక్ష్మి, చిట్టిబొట్టు, పసుపుగౌరి, మొగదోసిళ్ల పూర్ణాదివారము, గ్రామకుంకుమ, ఆపదలేని ఆదివారము, దంపతుల తాంబూలము, మాఘపాదివారము మొదలగు 32 వ్రతములు వాని సంపూర్ణకథలు, ఉద్యాపనలున్ను, రెండవభాగమున గాజులగౌరీదేవి, పోలమావాస్య, ఉదయకుంకుమనోము, నిత్యశృంగారము, శాకదానము పండుతాంబూలము, మునికార్తి వ్రతము, కన్నెతులసెమ్మ, కాటుకగౌరి గంధంతాంబూలము, బాలాదివారము, చిలుకుముగ్గు, బొమ్మలనోము మొదలగు 32 కథలున్ను మూడవ భాగమున అన్నము ముట్టని ఆదివారాలు, అమావాశ్యాసోమవారము, నిత్యవిభూతి, దీపదానము, కల్యాణగౌరి, కడపగౌరి, లక్షపసుపునోముకథ, భాగ్యాదివారాలు, మూసివాయనాలు, సూర్యచంద్రుల నోముకథలు, మొదలు 33 కథలున్ను గలవు వెలస్వల్పము. ఒకసెట్టు మీయింటనున్నచో సన్ని నోములు పట్టినట్లే.

3 భాగములు కలిపి. 96 నోములు కలిపినబయిండు 0—12—0

# శుకసప్తతికథలు

గ్రంథకర్త:—మద్దూరి శ్రీరామమూర్తిగారు.

పద్మావతియను స్త్రీ పరపురుషునితో రమింపబోవుచున్నపుడు కోటికిరాత్రి కొక్కొకకథ చెప్పి యా ప్రయత్నమునుండి మళ్ళింప జేసిన 30 కథలిందుగలవు. జగన్మోహిని, కామిని, విరూపాక్షుడు, సుముఖీదుస్సుముఖులు, శకుని, సుందరుడు, విక్రమసేనుడు, కాంతమతి, గుణనిధి, సాహిని, రుక్మరావుజగన్మోహినులు, శాంత, గర్గుడు, నరపాలసోమదత్తులు, అద్భుతఫలము, మాయసన్యాసి, కటిలుడు, ముత్యాలహారము ఇందుముఖి, చంద్రవదన, మీనరాజు, శృంగారవతి, విక్రమార్కుడు, మన్మథుడు, దేవయాన, ప్రభావతి, మోహనాంగిమొదలగుకథలుకలవు. ప్రతికథ శృంగారరసపూరితమే. వెల రు 0—8—0.

కొండపల్లి వీరవెంకయ్య, శ్రీ సత్యనారాయణ బుక్కుడిపో, రాజమండ్రి.